Reg. No. 757.

# అభినవసరస్వతి

యమనోక మాసపత్రిక.

అష్టావధాని జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు.

సంపుటము 16 | 1924 సం॥ ఆగష్టు. | సంచిక 5.

విషయములు.







చందానిర్ణయము సంవత్సరమునకు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పరిధానపోషకులకు | రు 25 | 0 | 0 | సహాయులకు | రు 5 | 0 | 0 |
| పోషకులకు | రు 10 | 0 | 0 | చందాదారులకు | 3 | 0 | 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry.

# చందా దయచేసిన పోషకులు.

౧ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానెకొండూరు
౨ ఎనమండ్రి లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ
౩ రాజా వెంకటాద్రియప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు
౪ రాజామంత్రిప్రెగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లిం[illegible]
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు
౬ శ్రీరా[illegible]యాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము

# సహాయులు.

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము
౨ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౩ నడింపల్లి నరసింహారావుగారు, జిల్లా రిజిష్టరాఫీసు, గుంటూరు
౪ తాచకొండ వెంకటరామయ్యగారు, యెనమదల
౫ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౬ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు. తాలూకాబారు, మిరియాలగూడెం

# చందాదారులు.

౧ ప్రభల వెంకటసుబ్బయ్యగారు, కలెక్టరాఫీసు క్లార్కు, గుంటూరు.
౨ జంధ్యాల చినసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మునిసిపల్ హైస్కూలు తెలుగు పండితులు, నర్సారావుపేట.
౩ పులిజాల సీతారామారావుగారు, పట్వారి, మిరియాలగూడెము.
౪ ఏరుగొండ నరసింహారావుగారు, పట్వారి, కుక్కడము.
౫ తుమురుగోటి సీతారామయ్యగారు, పట్వారి, తిరుమలగిరి.
౬ ఉద్దెమఱ్ఱి వెంకటప్పారావుగారు, స్కూలుమాష్టరు, అలుగుమల్లెపాడు.
౭ వుల్చి రామయ్యగారు, పేరికలపాడు.
౮ కంచిరాజు లక్ష్మీనరసింహముగారు, వకీలుగుమాస్తా, కడప.
౯ పిరివింటి విశ్వనాధయ్యగారు, వోర్వకల్లు.
౧౦ మోతె నారాయణరావు జమీందారుగారు, ఏలూరు.
౧౧ శంకరమంచి అన్నయ్యశాస్త్రిగారు, చినవోగిరాల.
౧౨ వేలమూరి వెంకటసుబ్బారావుగారు, డిస్ట్రిక్టుమున్సిఫ్, ఆస్కా.
౧౩ దెందుకూరి బ్రహ్మందీక్షితులుగారు, గుంటూరు.

సంపుటము ౧౬. { జానపాడు
రక్తాక్షి సం॥ శ్రావణమాసము. } సంచిక ౨.


## శ్రీపుష్పగిరి స్వామివారు, కొల్లూరు.

బ్రహ్మశ్రీ జనపాటి పట్టాభిరామశాస్త్రిగారికి.
అయ్యా! మీపత్రికలో నిది ప్రచురింపుఁడు.

నేను కొల్లూరుగ్రామమునకు ఆషాఢ బ ౧౫నాడు ప్రాతఃకాలమున ప్రవేశించితిని. కృష్ణానదీమతల్లి కొల్లూరుగ్రామజనానందప్రవాహము వలె పొంగిపొరలి గ్రామసీమయందుండు చేలన్నియు నావరించినది. కృష్ణకాలువలు ధారాసంపాతమువలె ప్రవహించుచున్నవి. అదిచూచి నంత నాకు మితిలేని కుతూహల మావిర్భవించినది. అంత మధ్యగ్రామమునం దొకచోట బ్రాహ్మణబృందము గుమిగూడి శ్రీశ్రీ పుష్పగిరిస్వామివారి చాతుర్మాస్యభిక్షలకై యేర్పాటులు చేసికొను చుండ నచ్చటికి నేను పోవఁగలిగితిని. అందు శ్రీ స్వామివారి భిక్షలకై బ్రాహ్మణోత్తములు చూపించెడి యావేగములు కడుంగడు శ్లాఘనీయములు. వారి యుత్సాహపూరిత సంభాషణములు బహుశ్రావ్యములు. వారికి శ్రీవారిపైఁగల భక్తితాత్పర్యములు బహువర్ణనీయములుగాఁ గనుపట్టినవి. అంతట శ్రీవారిని సందర్శించితిని. వారు సాక్షా చ్ఛివావతారమువలె కనులకుఁ బరమామోదముఁ గొల్పిరి. వారి శమదమాదిగుణసంపత్తికి నాయుల్లంబు పల్లవించినది. వారు శివపూజగావించువేళలో వారిని సందర్శింపని జన్మము నిరర్థకమని నాకుఁ దోఁచినది. శ్రీచంద్రమౌళీశ్వరప్రసాదమున శ్రీశ్రీ పీఠమున కింతకన్న నెక్కువపరిస్థితు లేర్పడఁగలవని నాకు స్ఫురించుచున్నది.

కాశీనివాసులగు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సాయంకాలములయందు ప్రతిదినము శ్రీచంద్రమౌళీశ్వరసన్నిధానమునఁ జెప్పుచుండిన సంస్కృతభాగవతపురాణము కర్ణసహస్రపేయమైయున్నది. శ్రీ ఆంజనేయశాస్త్రిగారు పీఠసన్నిధిలోఁ జెప్పెడి భగవద్గీతాపురాణ మతిశ్లాఘనీయమైయున్నది. మేము పీఠసన్నిధిలో మూఁడురోజులుంటిమి. ఆ బ్రాహ్మణసంతర్పణము లా దేవతాపూజాసంవిధానంబు లనుభవైకవేద్యంబులై యున్నవి. ఒకనాఁడు నాయన్నగారు కావ్యకళానిధి శతావధాని చిదంబరశాస్త్రిగారు స్వరచితమైన భారతీయప్రబోధము కొంత శ్రీపీఠసన్నిధిలో వినిపించిరి. అందువర్ణాశ్రమధర్మవిచారము చక్కఁగా వర్ణింపఁబడినది. అది యాస్తికులగు నచ్చటి విద్వజ్జనుల కెల్ల కర్ణరసాయనమైనది. శ్రీవారు శ్రీ చిదంబరశాస్త్రిగారిచే దమ సన్నిధిలో నొక యవధానము చేయింతుమని వాక్రుచ్చిరి. అది మల్లాది రామకృష్ణచయనులుగారు మున్నగు విద్వజ్జనులు నుఱకొందగఁ జేరినపుడు చాతుర్మాస్యదీక్షలోపలనే చేయించుటకు నిశ్చయింపఁబడినది. శ్రీ చంద్రమౌళీశ్వరప్రసాదమున నిట్టి విద్వత్సన్మానములతో నానాఁటికి శ్రీజగద్గురు పుష్పగిరిపీఠము వర్ధిల్లుఁగాకయని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు,

పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

## పాకయాజిగారి ప్రల్లదములు.

నాలుగైదుమాసములనుండియు వార్తాపత్రికాపాఠకులు కల్యాణానందభారతీస్వాములవారినిగూర్చియుఁ పాకయాజిగారినిగూర్చియు నున్న విశేషములు తఱచు చదువుచున్నవారలు. ఆ క॥స్వాములవారు శారీరకమీమాంసాది భాష్యప్రవచనముగావించి పా॥జిగారికి మహా

పకారము గావించియున్నవారఁట, అందులకై గురుదక్షిణగాఁ బీఠసంగ్రహచరిత్రవ్రాసి వారికి సమర్పించుకొనిరఁట. ఎవరిగురువులకు వా రేదో సమర్పించుకొందురు; దాని కేమిగాని పుష్పగిరిపీఠపరిపాలనము క్రిందనుండు మనదేశమునకువచ్చి యీకల్యాణ॥ స్వాములవారు శ్రీముఖములనుపేరఁ బుష్పగిరిపీఠాధిపతులఁగూర్చి కర్ణకఠోరములగు ప్రల్లదములు ప్రచురించుచు దేశజనుల నందఱను దమశిష్యులఁగా భావించి శాసింపమొదలిడిరి. అందుపై మేము పుష్పగిరివారి శిష్యులమే కాని మీశిష్యులము కామనియు వారియెడల మీరిట్టిప్రల్లదముల నుపయోగించు టనర్థమనియు ననేకగ్రామములనుండి యనేకశతసంఖ్యాకులు తెలియఁబఱచిరి. వారిలో సామాన్యబ్రాహ్మణులేకాక వేదశాస్త్రసంపన్నులును గర్మజ్యేష్ఠులును బలువు రున్నవారు. ఇట్టివారందఱును దామువ్రాసిన శ్రీశృంగేరీ విరూపాక్ష శ్రీపీఠసంగ్రహచరిత్రకు రిపువులఁగాభావించి పా॥ జగారు తత్కాలపోలచపేటికయని ప్రచురింప మొదలిడిరి. కల్యాణ॥ స్వాములవారే యేతద్దేశగురువులని భావించువారు వాకయాజప్రభృతులు లక్ష కొక్క రుందురనుటకుఁ గూడ సంశయము. అట్టిచో సీపా॥ జగారి కెన్నిలక్షలమందిశత్రువు లుండవచ్చునో తెలియకున్నయది. వీరికందఱికిని గల్యాణ॥ స్వాములవారు మాగురువులుకారని యనరుగా యనరుగా యని చెంపదెబ్బలు వేయుట కీపా॥ జగారు సాహసించిరి. ఈసాహసమేకాక మహాలయశ్రాద్ధవిధానము ననుసరించి ప్రత్యేకానూదరణములను జెప్పించు నొక్కొక్కరి కొక్కొక్క పిండప్రదానముగూడఁ గావించియున్నవాఁడు. ఈయన పిండప్రదానముగావింపని లింగధారిసంఘమున జనించినవాఁడు. పిండప్రదానాచరణము శాస్త్రవిరుద్ధమనికదా యీయన యందులకుఁ గడంగనది! అట్టిచోఁ బిండపితృయజ్ఞమాచరింపని పితృపితామహాది స్వపూర్వులందఱుం బతితులని యొప్పుకొనితీరవలయును. అట్టిపతిత

వంశమం దుద్భవిల్లిన యీయన యేప్రాయశ్చిత్తముచే శుద్ధుఁడై యందులఁ బ్రవేశించెనో యట్టిప్రాయశ్చిత్త మేధర్మశాస్త్రమందుఁ జెప్పఁబడియున్నదో ముందు వివరింపవలసియున్నది.

తన యీ నూతనపిండప్రదానవిధిలోఁ జచ్చినవారికేకాక బ్రతికియున్నవారికిఁగూడఁ బిండములు వేయుమని యున్నదికాఁబోలు. క్రొత్తపిండప్రదానమునకు దిగి క్రొత్తబిచ్చగాఁడు ప్రొద్దెఱుఁగఁడన్నట్లు సదా పిండప్రదానమే యనుష్ఠానముగాఁ బెట్టుకొన్నవాఁడు. జీవన్మృతు లను వాదమునకు దిగిన-చోశ్రుతశబ్దప్రయోగవశమున వీరందఱును బ్రహ్మరక్షస్సులై తన్నుఁ దప్పక వేధించితీరుదురు. మంత్రకాఁడనుగాన మారణహోమము చేయుదునని బదులుచెప్పవచ్చునేమో! ఇన్నిబ్రహ్మరక్షస్సు లావహించినపుడు తనకుఁగాదుగదా తనకు మీమాంసాబోధకులును శ్రీవిద్యోపాసకులును నగు కల్యాణ॥ స్వాములవారికిఁగూడ నిర్జింపఁదరముకాదు. శ్లో॥ బహూనా మల్పసారాణాం సమవాయో దురత్యయః॥ మహాలయశ్రాద్ధవిధానము ననుసరించి పిండములు పెట్టుటకు ధర్మపిండములు నాలుగింటికన్న నెక్కుడు లేవు. అప్పుడు "ఆచాపితా" యనుశ్లోకమందుఁ జెప్పఁబడిన ప్రకారమే యాచరింపవలసియుండును. అందువలనఁ శా॥ జగారు కొందఱికిఁ గొడుకును గొందఱికి మనుమఁడును నిట్లే పలువరుసలతో నిందఱికిని రక్తసంబంధి కావలసివచ్చును. అట్టి నానారక్తసంజనితత్వమునకుఁ దా నొప్పుకొన్నను బ్రతిపక్షులొప్పుకొనరు. పతితవంశమునఁ బుట్టి ప్రాయశ్చిత్తశుద్ధుఁడుకాకయే పరులకుఁ బిండములు వేయఁగడంగినవాఁడు పతితాతిపతితుఁడుకాని వేఱొండుకాఁడు. ఈపతితత్వ మేతద్వాదానుసృతము కాని లింగధారులెల్లరుం బతితులనికాదు మదాశయము. తద్విషయమప్రస్తుతము. లింగమును వీడకయుఁ బిండములు పెట్టుచు నుభయభ్రష్టుఁడై స్వమతమునకుఁ గళంకముగలిగించిన శా॥ జిగారితోడనే

యూపతితత్వమునుగూర్చి లింగధారులు వివదించుదురుగాక. పా॥ జీగారు దేశమంతయు నజ్ఞానాంధకారమున మునిఁగి కేవలము బలహీనమై యున్నటుల భావించుచున్నవారు. ఎట్లుభావింపనిదే"యిఁక నిట్టిదూషణ కరపత్రికల నెన్నటికిని వేయరుగా వేయరుగాయని...ఒక్కొక్కరిచెంపకు నొక్కొక్కలెంపకాయవంతున వేయుచున్నా"మనియు"నిపుడు పుష్ప గిరిపీఠము నధిష్ఠించియున్న గింజుపల్లి చక్రియ్యగారు పతితు"లనియు" మల్లాది రామకృష్ణచయనులవంటివారిచే నిర్ణయింపఁబడిన ధర్మముల ననుష్ఠింపవలసినవారు నక్రమసన్యాసమును స్వీకరించి పతితులైన గింజుపల్లి చక్రియ్యగారును నా...చక్రియ్యగారే మాకు గురువు లు...గాని యన్యులు...కాఁదగరని పత్రికలుప్రకటించుచున్న...పతిత శిష్యులును నగుదురుకాని వివేకవంతులును ధర్మవంతులును నగు భార తీయు లెంతమాత్రముచు గా"రనియు"బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రు లు చక్రియ్యగారిని గురువులనఁగా నంగీకరింతురని యత్నించిదపి మానవత్వముగలవాఁడు తలంచ"డనియు నిట్టిప్రల్లదములు ప్రచు రింపఁడు. ఈయన యొక్కొక్కరి కొక్కొక్క చెంపదెబ్బయే వేసెనుగాని యీతప్పుడువ్రాఁతలనుజూచి పలువుంది పాదరక్షాప్రయోగమొన రించుటకే ప్రయత్నించుచున్నవారు. పా॥ జగారు"చచ్చితి కుయ్యో మొఱ్ఱో యిఁకనెన్నటికి నిట్టిప్రల్లదములు వ్రాయ"ననునంతవఱకు వారు వదలిపెట్టరు. దుందుభిసం॥వైశాఖశుద్ధంప్రభృతి నేఁటివఱకుఁ బ్రకృతపుష్పగిరిపీఠాధిపతు లెంతదేశము సంచరించిరి ? ఎట్టిమహామ హులు పూజించుచుండిరి?వీరందఱును మనుష్యులుగాక కేవల పశువు లనియేకదా యీయనవ్రాసినది? కోట్లమంది .జనులు పశువులై యొక్క తానును దన సతీర్థ్యు లోకరిరువురును దన గురుపరమగురు వులునా మనుష్యులు?అందఱుంజేరి యెందఱగుదురు?పదిమంది యగు దురో లేక యక్కడ నిక్కడఁ బ్రోగుచేసినఁ బైని సున్నపడునో. ఇంత

స్వల్పసంఖ్యాకులే మనుష్యులును వివేకులును బవిత్రులును ధర్మ వంతులును నై తక్కటి కోట్లజనులు పశువులును నజ్ఞులును బతితులును నధర్ములును నయిరికా? కానిండు. పదిమందితోఁజావు పెండ్లితోసమా నమన్న సామ్యమననుసరించి యింతమంది యవలంబించినపని యెట్టి దైనను దొందరలేదు. "మహాజనో యేనగత స్సపంథాః" మఱియు, ఈపా॥ జగా రేమేమో చర్చించి గురువుగారితోపాటు కూని కేసంతయు విచారించి ప్రకృతపుష్పగిరిపీఠాధిపతులగు నభినవోద్దండవిద్యానృ సింహభారతీస్వాములవారి కభినవోద్దండ విద్యాశంకరభారతీకరకమల సంజాతత్వము చెల్లనేరదని ఢంకామీఁద దెబ్బవేసి మఱిఁజాటించిరి. మొన్న మొన్న నే వీరిగురుస్వాములవారి యాస్థానమునఁ గొత్తది యొకఢంకా తెచ్చిపెట్టిరి. ఈయన తన యధికపరిసంగముతో నిటు వచ్చియొకదెబ్బయు నటువచ్చి యొకదెబ్బయుఁ గొట్టి యాయొక్కటియు నెక్కడఁబగులఁగొట్టునో! మంచిది. తమపెద్దమాంతాచార్యులవారికే వి ద్యానృసింహశంకరభారతీకరకమలసంజాతత్వ మెటుచెల్లునో ముందు చెప్పుదురుగాక. వారిబిరుదములో వారట్లు వ్రాసికొనుటలేదందు రేని కరకమలసంజాతేతరులకుఁ బీఠాధికార మెట్లువచ్చెడు? ఇంతకు నా విషయములన్నియు నాకాలమున సమక్షమందున్నవారు నిర్ధారింప వలసినవికాని వేఱుకాదు. అట్టివారు తర్లుపాడుగ్రామస్థులును దత్కా లమున నక్కడనున్న మఱికొన్నియూళ్ళవారును.

వారందఱు విద్యానృసింహభారతీస్వాములవారి సన్యాసా శ్రమస్వీకార జగద్గురు పుష్పగిరిపీఠాధిరోహణాదికము లన్నియు నిరాక్షేపములని సమ్మతించి దస్కతులుచేసి వారివలనఁ దీర్థఫలమంత్రా క్షతలం గైకొని సేవించుచు దేశసంచారమున కుపక్రమింపఁజేసియున్న వారు. అట్టి ప్రకృతపుష్పగిరిపీఠాధిపతుల నెవరెన్నితిట్టినను నెన్నిపత్రి కలుప్రచురించినను నెన్నివిచారణములుచేసినను నెన్నిప్రతిజ్ఞలుపట్టినను

నిష్ప్రయోజనము. కంఠశోష. ఇవియన్నియు నబుసుపోకకు హేతువు
లే కాని వేఱొండు కావు. వారి జగద్గురుత్వము నిరాఘాటముగాఁ
జెల్లియే పోవుచుండ మహామహులందఱుం బూజించి పునీతులగు
చుండ నెవరిపుట్టి చేయి యడ్డుపెట్టిన నేమి కానున్నది? జగద్గురుపీఠముల
యన్నింటిలోనను శృంగగిరిది యాదిపీఠమని యందఱియొక్కయు నభి
ప్రాయము. అట్టిశృంగగిరిపీఠమునకూడఁ దమ శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్ష
మను పీఠబ్రువము క్రిందిదని మన స్వా॥ జీగారు వ్రాయుచున్నారు.
ఆశృంగగిరిపీఠమునఁగూడఁ బ్రకృతిస్వాములవారు ప్రాక్తనస్వామికరక
మలసంజాతులు కారు. వారి యోగపట్టాదులును దద్దత్తములు కావు.
ముం దీపరిశీలన మంతయు నచ్చటనే జరిపి యాపైని టకు వచ్చిన నిచ
టను దత్రత్యమమే సిద్ధాంతీకరింపవచ్చును కావునఁ బా॥ జీగారు తదర్థ
మయి యత్నింతురుగాక. పూర్వమునుండియు నిట్టి యవాంతరములు
జరిగినప్పుడు కాలోచితముగా గౌణపక్ష మవలంబించి సన్యాసాశ్రమ
స్వీకార జగద్గురు పీఠాధిరోహణాదులు కావింపఁబడుచున్నయవియు.
కౌండిన్యగోత్రుఁడు భారద్వాజగోత్రుని గన్నారని చెప్పుటకును
నింద్రసరస్వతీగోత్రులగు విజయవాడయతులు భారతీగోత్రులగు పుష్ప
గిరిపీఠాధిపతులను గన్నారనుటకును భేదమేమి” యని స్వా॥ జీగారు
తర్కించుచున్నవారు. అన్యగోత్రజాతుని బుత్రునిగా స్వీకరించుట యా
చారములోను నున్నది. శాస్త్రమును జెప్పుచున్నది. ఔరసాభావమందు
దత్తస్వీకార మెట్లుపుట్టినదో ప్రత్యక్షపీఠాధ్యక్షమంత్రోపదేశాభావ
మున నపరయతికృతమంత్రోపదేశమునట్లుపుట్టినది. ప్రకృతమట్లునుగాక
విజయవాడయతులు నియమవిధిమాత్రబోధకులే యనియు ముఖ్య
మంత్ర మా విద్యాశంకరభారతీస్వాములే త్రుటికాలమున నుపదేశిం
చిరనియుఁ దత్రత్యరహస్యవిదులు నాకొనుచున్నవారు. అనుమాన
ప్రమాణము ప్రత్యక్షశాబ్దముల తరువాతిది కాని మొదటిది కాదు. అట్టి

శాస్త్రప్రమాణమైన యాప్తవాక్యమును విశ్వసింపక మన పా॥ జిగారు చేయు కుతర్కమంతయు గగనారవిందమున సురభిత్వసాధనతుల్య మగుటకు సంశయముండదు.

మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులవారు సంస్థానవిద్వాంసులుగా నున్నారనియుఁ దత్ప్రముఖ విద్వజ్జనులచే సనాతనధర్మోద్ధరణపద్ధతులు నిర్ణయింపింతుమనియుఁ దన్నిశ్చితధర్మప్రచారమునకు గొల్లపూడి లక్ష్మణసోమయాజిగారిని గవ్వగంటు సీతారామచయనుల వారిని నియమించినామనియుఁ బ్రకృతపుష్పగిరిపీఠాధిపతులు శ్రీముఖమును బ్రకటించిరి. దానినిబురస్కరించుకొని సీతారామచయనుల వారికిఁ బ్రకృతపుష్పగిరిపీఠాధిపతుల సత్యచరిత్ర తెలియక యీకూటములోఁ జేరినారనియుఁ దమవిమర్శముఁ జదివిన వెనుక నొకగడియ యైన నందుండరనియుఁ నుండునెడల వారింగూర్చి మఱియొకతూరి ముచ్చటింతుమనియుఁ బా॥ జిగారు వ్రాయుచున్నారు. సీతారామ చయనులవారితోపాటు తానును ధర్మప్రచారముచేయింపుఁడనియుఁ బత్రికనుస్థాపింపుఁడనియుఁ బ్రకృతపుష్పగిరిపీఠాధిపతులు చిలకలూరు పేట నలంకరించియున్నపుడు ప్రార్థించియున్నవాఁడె. మృతమైన శ్రుతి ధర్మములఁ బునరుజ్జీవింపఁజేయుటకుగాఁ బత్రికనడుపుచుంటినిగాన ముద్రాయంత్రమొకటి యిప్పింపుఁడని రెండుమూఁడుసంవత్సరములు తిరుగఁదిరుగ నివి పాముకుఁబోసిన పాలగునని భావింపక గతించిన పుష్పగిరిస్వాములవా రాఱునూఱులరూపాయ లిందులకు వ్యయ పెట్టిరి. తినమరగినకోడి యిల్లెక్కికూసెనన్న చందమునఁ బత్రికనెల కొల్పఁ బురికొల్పి తదర్థమొసంగుధనముగూడఁ దనమొడిలోనేపోసి కొనితనపత్రికయే పుష్పగిరిసంస్థానపత్రికగామార్పవలెననిమాయోపాయములు పన్నెఁగాని యీయనయుద్దేశము ధర్మప్రచారార్థమైనదు నోరు మంచిదికాదని ప్రకృతపుష్పగిరిపీఠాధిపతు లియ్యకొనరైరి.

అదియు నిదియు మనసునఁ బెట్టుకొని ప్రకృతపుష్పగిరిపీఠాధిపతులఁ
బడఁదిట్టుచుండుట యెవ్వరు నెఱుఁగరనికాఁబోలుఁ బాపము మన పా॥
జిగారు సీతారామచయనులవారిని బెదరింపఁజొచ్చిరి. తన **యీవిమ**
ర్శముఁ జదివినపిమ్మట నొక్కగడియయైన నుండక **పుష్పగిరిసంస్థాన**
విద్వన్నిర్ణీతధర్మప్రచారకకూటమునుండి తొలఁగిరాకున్న నింకొకసారి
సీతారామచయనులగారిని బడఁదిట్టును. సీతారామచయనులవారివలెఁ
గొల్లూరు బ్రాహ్మణసభవారును దనవిమర్శనల కలరి స్తుతించినవారలే
**కావచ్చును.** ప్రకృతపుష్పగిరిపీఠాధిపతుల నాకొల్లూరు బ్రాహ్మణులే
యాహ్వానించి తీసికొనిపోయి చాతుర్మాస్యదీక్షను సలిపించుచున్న
వారు. సీతారామచయనులవారికింబోలె నా కొల్లూరువారికిని బా॥
జిగారిఁక నిట్టిబోధ చేయుదురు కాఁబోలు.

ప్రకృతపుష్పగిరిపీఠాధిపతులు సంచరించి చాతుర్మాస్యలుజరిపి
వచ్చినగ్రామంబులన్నిటికంటెఁ గొల్లూరు సర్వవిధముల మిన్నయనక
తప్పదు. అందు మొదటినుండియు వేదశాస్త్రసంపన్నులు విశేషించి
యుండుచున్నవారు. అట్టివిద్వద్వరులందఱును బాకయాజిగారి వ్రాఁత
రీతిని బశుపులును నజ్ఞులును బతితులును నధర్ములును గావలసివచ్చు
చున్నది. సామాన్యులుంబోలె నా కొల్లూరువిద్వద్బ్రాహ్మణసభ
వారును నట్లగుట కంగీకరించి యూరకుందురో లేక యిట్టిప్రల్లదముల
వ్రాయు పా॥ జిగారికిఁ బ్రాయశ్చిత్తముగాఁ బాదరక్షాప్రయోగమే
యొనరింతురో చూడవలసియున్నది. గుంటూరుమున్నగు ననేకగ్రా
మంబులనుండి యనేకచతుర్వర్ణజనులు కల్యాణానందభారతీ మాంతా
చార్యులవారు మాకుగురువులుకారని వ్రాయుచున్నదానికిఁ బాక
యాజిగారు "యతులను మాకుగురువులుకారని గృహస్థులగు వీరు
పత్రికలు వ్రాయఁదగునా? కాషాయదండమాత్రేణ యతిఃపూజ్యో
నసంశయః యనుశాస్త్రమును వీరు పాటించరా ?" యని ప్రశ్నించు
చున్నారు. ఇట్లుప్రశ్నించిననోటితోనే "యిప్పుడు పుష్పగిరిపీఠమునధిష్ఠిం

చియున్న గింజుపల్లి చక్రియ్యగారు పతితు"లని పదేపదే ప్రల్పించు చున్నాఁడు. "కాషాయదండమాత్రేణ"యనునది తనయతులకువర్తించి నట్టితరయతులకు వర్తింపదు కాఁబోలు. పుష్పగిరిపీఠాధిపతులే చిన మాంతాచార్యులకు శిష్యులని తనచే రచింపఁబడిన శ్రీపీఠసంగ్రహ చరిత్ర చెప్పియున్నదఁట. అపుడు శ్రీవారు పుష్పగిరిపీఠాధిపతులే మా గురువు లనుపై దూషణకరపత్రికాపతులకుఁ బరమగురువులఁట. చరిత్ర యెపుడును రికార్డునకు సంబంధించియుండునఁట. అది యాచరిత్ర వ్రాసినవారికడ నుండునదికాని సర్వత్ర లభించునది కాదఁట. అందు నమ్మకములేనివారు మహాజనసభఁజేసి యచటికి శ్రీ పా॥ జిగారినిబిలిచిన వచ్చి తమచే రచింపఁబడిన చరిత్రకాధారములు కనఁబఱచి సిద్ధాంత ముచేయుదురఁట. ఆహా! యేమీ వీరిరికార్డు! ఏమీ వీరిసత్యసంధత! రికార్డు-చరిత్రవ్రాసినవారికడఁదప్పనన్యత్రయుండదుకా? వీరి రికార్డెయ్య ది? రాజమహేంద్రవరాది న్యాయస్థానముల తీర్పులున్నవనియే కదా! అవియన్యులయొద్ద నేలయుండఁగూడదు? వాని కెంతమంది పబ్లీ కునకళ్ళుతీసికొని యుంచలేదు? అట్లుతీసికొని యందలియాథార్థ్యమంత యుఁ దెలిసికొనఁబట్టియేకదా వీరివాదములఁ బూర్వపక్షముచేయఁ గలిగినది ?

ఇఁక "మాది యాద్యమైన శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్షపీఠ"మనియు "శృంగగిరిపీఠము మాక్రింది"దనియు "పుష్పగిరిది మాకుఁ గప్పము చెల్లింపవలసిన యుపపీఠ"మనియు "విరూపాక్షపీఠము కల్పితమనియుఁ బెదమాంతాచార్యులు వ్రాయించియుంచిన రికార్డొకవేళ నితరుల యొద్ద లేకపోవచ్చును. ఆకట్టలు ప్రత్యహము విప్పిచూచుకొనుచు వారే సంతసింతురుగాక. వానితో నెవ్వరికిని బనిలేదు. "మీరు వ్రాసిన పీఠసంగ్రహచరిత్రయందు మాకుఁ బ్రమాణబుద్ధిలేదం డురా? " యని పా॥ జిగా రడుగుచున్నారు. మున్ముట్టికిని లేదు. నిన్నఁగాక మొన్న గుంటూరు డిస్ట్రిక్టుమున్సిఫ్‌కోర్టులో మల్లాది

రామకృష్ణవిద్వచ్చయనులవారు చెప్పిన సాక్ష్యమును బురస్కరించుకొని లోకులు వారిపైఁగల గౌరవమును వీడఁదగినంత హేతువునుజూపుచు దూషించి వ్రాసిన యీపా॥ జిగారి పల్లదములను మనుష్యమాత్రుఁ డెవ్వఁడును నమ్మఁడు. చూడఁడు.

శ్రుతిధర్మసంజీవిని.

"...మల్లాది రామకృష్ణచయనులవారు ధర్మనిర్ణయమున కనర్హులని వ్రాయవలసివచ్చినందులకుఁ జింతిల్లుచున్నవారము... ధనమునకో పాలమునకో యాసపడి ధర్మమును నధర్మమునుగాను నధర్మమును ధర్మమునుగాను నిర్ణయించెడి రామకృష్ణచయనులవారు ధర్మనిర్ణయార్హు లెట్లయ్యెదరు?... గుంటూరు వాస్తవ్యులగు మ॥ నడింపల్లి నరశింహారావుగారు పరదేశమునకేగివచ్చినవారు. అందుచే వారిదేవాలయధర్మకర్తృత్వమును పౌరులునిరాకరించిరి. అపుడు నరశింహారావుగారు వారిపై దావా తెచ్చిరి. ఆదావాలో మన రామకృష్ణచయనులవారు పౌరులపక్షమున సాక్ష్యమునకువెళ్ళి యింగ్లాండునకు పోయివచ్చినవారు. ... ప్రాయశ్చిత్తము చేసికొనినను బునీతులుకానేరరని తెగవేసి చెప్పియున్నవారు. అటుపై... పాటిబండ వెంకటరమణయ్యగారు మావలెనే పరదేశములకేగివచ్చిన దాసువారితో వియ్యమంది కావించిన వివాహసందర్భమునఁ దాము శ్రీరమణయ్యగారింట భుజించినారా? లేదా? చెప్పుడని రావుగారడిగిరి. భుజించితిమని చయనులవారు ప్రత్యుత్తరమిడిరి. అదెట్లు పనికివచ్చినదని ప్రశ్నించిరి. రమణయ్యగారికి ప్రాయశ్చిత్తముక్రింద లింగతీర్థమిచ్చి భుజించితిమనిరి. లింగతీర్థమన నేమనిరి. తులసితీర్థమనిరి. అటులేని మాకును తులసితీర్థమిచ్చి మాయింట భుజింతురాయని యడిగిరి. పలుకాదనిరి. కారణమేమని యడిగిరి. రమణయ్యగారు పదమూడెకరములపొలము మాది పోవునపుడు పోకుండ గాపాడి యిప్పించినారు. అందుచే వారింట భుజించినామని సెలవిచ్చిరి.

అటులేని మేమును బదుమూడెకరములపొలమును బోకుండఁ గాపాడి యిచ్చెదము. మాయింటను భుజింతురాయని రావుగారు ప్రశ్నించిరి. ఆహా! యట్లయిన నభ్యంతరములేదని చయనులవారు సెలవిచ్చి యున్నారు."

రామకృష్ణచయనులవారి సాక్ష్యము.

... "బెజవాడలోఁ బాటిబండ వెంకటరమణయ్య నెఱుఁగుదును... దాసువంశమునకు నాయనకు బంధుత్వమున్నదని నాకుఁదెలియును. ...నేను దాసువారియింటిలో స్వయంపాకము చేసికొనలేదుకాని సంబంధముచేత నీయనకుఁ బాపమురాదుకనుక రమణయ్యగారియింటిలోఁ జేసికొన్నాను. అక్కడఁగూడ నేను మొట్టమొదట నాయనకు లింగతీర్థమిచ్చి తర్వాత స్వయంపాకముచేసికొన్నాను...నావికాయానముచేసివచ్చినవారితోఁ గలసిభోజనముచేసినవారితో భోజనముచేయుటగూడ నింద్యమేయని నానమ్మకము. దాసువారికుటుంబముతో నేను భోజనముచేయను. దాసువారి సంబంధికుఁడును నక్కడ భోజనము చేసితేఁ జేయవచ్చునని తలఁపఁదగినట్టివాఁడునగు వెంకటరమణయ్యయింటిలో...స్వయంపాకముచేసికొని భోజనముచేయుట కభ్యంతరమని తెలిసి నప్పటికి శిష్యుఁడుగనుకను నాకు స్నేహితుఁడుగనుకను సాలగ్రామతీర్థమిచ్చిసంసర్గదోషముపోవునట్లు చేసినానుగనుకను భోజనముచేసినాను. ఇతరత్ర యిట్టికారణము లున్నను నటువంటివారియింటిలో భోజనము చేయను. అలంఘ్యమైతేఁ దప్ప సంసర్గులయిండ్లలోఁగూడ భోజనము చేయుదును. ఏదో పెద్ద లాభముపోవునన్నఁగాని ముఖ్యస్నేహము పోవునన్నఁగాని యాస్తిపోవునన్నఁగాని తప్ప లేకపోతే భోజనముచేయను. అప్పుడైనను మన్మనస్ఫూర్తిగాఁ గాదు. అట్టిసంగతిలోఁగూడ స్వతంత్రబుద్ధితో భోజనముచేసినానని చెప్పుటకు వీలులేదు. అట్టిభోజనమువల్ల నేను బతితుఁడను గాను. నేను సాలగ్రామతీర్థమిచ్చినది యెందుకంటె నేదైనను బరంపరాదోషముంటే నదినాకుఁ గలియకుండుటకు. నే నెవ

లేవరితో భోజనముచేసితినో వాండ్రిందటికి సాలగ్రామతీర్థమిచ్చినాను. సాలగ్రామతీర్థమువలనఁ బరంపరాదోషము పోవునుగాని సాక్షాత్పతిత సంసర్గదోషము పోదని నానమ్మకము..."

ఈ సా॥ జగా॥ వ్రాంతయుఁ బ్రకృతమునకు సంబంధించిన చయనులవారి సాక్ష్యభాగమును దిలకించి యిట్టియసత్యలేఖకునకుఁ జెంపదెబ్బ తేతగునో చెప్పుదెబ్బ తేతగునో నిర్ణయించుభారము పాఠకులపైననే పెట్టితిని. వీరి పీఠసంగ్రహచరిత్రయందు నమ్మకము లేకపోవుటకుఁగల కారణము లింకను దిలకింపుఁడు.

రాజమహేంద్రవరము సబ్ కోర్టుతీర్పు 48వ పేరా

"...ఈదావామఠము (అభినవవిరూపాక్షము) యొక్క మొదటిస్వామి యుద్దండభారతివలన నధికారమంతయుం గోలుపోయి యేవిధమైనయధికారము లేకుండఁ దెలుఁగుదేశములో సంచారము చేసెనని వాదింపవచ్చును. పీఠమున కేవిధమైన మఠముగాని యాస్తిగాని లేనందునఁ బైవాదమును బలపఱుపవచ్చును...

56వ పేరా.....మున్సిభ్ దానాపీఠ మాద్యమని చెప్పుట యసంభవము. అనవసరము. సాక్ష్యమువల్ల మున్సిభ్ గారు చెప్పినది నిజముగాఁ దోఁపదు...

64వ పేరా......గతించినస్వామి 1వ ప్రతివాదికి (బోధానంద భారతికి) పీఠ మిమ్మని చెప్పినట్లు...కనఁబడదు"

ఈరీతిగా నింతసుస్పష్టముగా విద్యానృసింహశంకరభారతులు (ఎనమండ్ర నరశింహశాస్త్రిగారు) బోధానందభారతికిఁ బీఠ మిమ్మని చెప్పినట్లును బీఠాధిపత్యము లేకుండఁ దెలుఁగుదేశములో సంచారము చేసికొనుచు బ్రదుకుమని యుద్దండ నరసింహభారతిచేఁ జెప్పఁబడినది యీ యభినవవిరూపాక్షమఠమునకుఁ జేరిన మొదటిస్వామి కేయైనట్లును రాజమండ్రి డిస్ట్రిక్టుమున్సిభుగారీపీఠ మాద్యమని చెప్పుట యనర్థమైనట్లును సాక్ష్యమువలన నీమున్సిభుగారు చెప్పినది నిజముగానట్లును దెలియు

చుండ విద్యానృసింహభారతులు తనపీఠము బోధానందభారతి కిమ్మని గ్రామస్థులతోఁ జెప్పి విల్వాసిపోయెననియు నిదియే యాదిపీఠమని సబ్ కోర్టువారుకూడఁ దీర్మానించిరనియు విరూపాక్షపీఠము కల్పితమనియుఁ బ్రచురించు పా॥ జగార్లపై నెట్లునమ్మకముండెడినో తెలియకున్నది. వీరియొద్దనే కాక యితరులయొద్దఁగూడ నుండఁదగిన రికార్డువలనఁ బాకయాజిగారువ్రాసెడి పీఠసంగ్రహచరిత్ర యసత్యమైనదని యిక్కడికి సుస్పష్టము. ఇఁక నేత చ్చతుష్టయము(పెదమాంతాచార్యులు చినమాంతాచార్యులు పా॥ జగారురామేశ్వరశర్మగారు) పదిలపఱచి యుంచిన “మాది శ్రీశృంగేరి శ్రీవిరూపాక్షపీఠము, శృంగగిరిపీఠము మాక్రిందిది, పుష్పగిరిపీఠము మాకుఁ గప్పము చెల్లించెడిది, విరూపాక్షపీఠము కల్పితము” మున్నగు పద్యపుఁబలకసంగతి పరిశీలించుదము. అది మహాజనసభఁజేసి పా॥ జగారిని బిలిచితే వచ్చి కనఁబఱచెదరఁట. ఇదివఱ కొకపరి యిట్లే యీపా॥ జగారి పరమగురువులగు పెదమాంతాచార్యులవారు సికిందాబాదాలోఁ జేరి పైసంగతులే చెప్పి పౌరులఁ గలవరపెట్టుచుండఁగా వీరు పీఠాధిపతులు కారుకావునఁ దదర్హగౌరవము వీరియెడలఁ జూపవలదని నేను మత్పత్రికాముఖమునఁ బ్రచురించుటయుఁ దత్కాలమున గురులసన్నిధనే యుండు చినమాంతాచార్యులయొద్ద మీమాంసయో యేమాంసయో చదువుచున్న సంఘమునకుఁజేరిన చివుకుల అప్పయ్యశాస్త్రిగారు నాకు స్నేహితులైనకతంబున “నిదివఱకే మీరు కొన్ని చిక్కులలో నుండియుండి బోధానందభారతి పీఠాధిపతి కాఁడనివ్రాసి మఱియొక్క చిక్కుదెచ్చి కొంటిరికాన వెంటనే క్షమాపణపంపుకొం”డని నాకు వ్రాసినను భయపడక మరల నా యప్పయ్యశాస్త్రిగారే “మీపై డిఫర్మేషను దెచ్చుటకుఁగా బోధానందభారతీస్వాములవారు లైపుగూడఁ గొట్టించి ముందునోటీసు సిద్ధముచేసినా”రని వ్రాసినపై నక్కాలమునకేదియో పనిమీఁద సికింద్రాబాదున కరిగి విరూపాక్షసంస్థానవిద్వాంసుల

యొద్దఁ గల సబ్ కోర్టు తీరుప్పుం జదువుకొని యీ బెదరింపులకు భయపడవలసిన పని లేదని నిశ్చయించుకొని యప్పయ్యశాస్త్రిగారి యింటి శేగుసరికిఁ బాకయాజిగారు చనుదెంచి గురు పరమగురువుల సన్నిధికిఁ దోహ్యానిపోఁ బోయి వారు శ్రద్ధమైఁ గనఁబఱచిన రికార్డంతయుం జూచితిని. కాని యీరికార్డు నాధారముచేసికొని మాది శ్రీశృంగేరీ శ్రీ విరూపాక్షపీఠమనియు నాద్యమనియు విరూపాక్షము కల్పితమనియు బోధానందభారతీ ప్రభృతులు లోకమును భ్రమింపఁజేయఁ జూచుచుండిరో యీరికార్డు ద్వారముననే కల్పితత్వవిశేషణార్హ మీ యభినవ విరూపాక్షపీఠమే కాని ప్రాచీనవిరూపాక్షపీఠము కాదని యభిప్రాయమయ్యెను. కావున మహాజనసభఁ గూర్చియే పా॥ జగారారికార్డుకట్టను దీసికొని రానింపు. దానిని శ్రద్ధచేఁ బరిశీలించినవారు నేనుబడినయభిప్రాయమే పడితీరుదురు. వేదోల్లప్రతికాగితము నామూలాగ్రము శోధించిన రాజమండ్రి సబ్ జడ్జిగారే యట్లభిప్రాయపడియున్నారు. చూడుఁడు. 55వ పేరా.

"ప్రతివాదిపక్షమునుండి దాఖలుచేయఁబడిన రికార్డును జాగ్రూకతతోఁ బరిశీలించిచూడఁగా మొదటిప్రతివాది (బోధానందభారతి) నిజమైనసంగతులు విచారింపకయే తనకే తెలియనటువంటి కొన్ని యాధారపత్రములను దొరికినంతవఱకు శ్రద్ధతోఁ జేర్చి యీవిషయమున నిర్మాణముచేసినట్లు నాకుఁగనఁబడుచున్నది. దాఖలుచేసినటువంటి రికార్డునుబట్టి చూడ దానామఠము యొక్క నిజమైనచరిత్ర నిర్మాణముచేయుటకు శక్యముకాదు".

కావునఁ బాకయాజిగారు మహాజనసభలో రికార్డుతోఁగూడ వచ్చి ప్రవేశించుటవలని ఫల మిసుమంతయుం గానరాదు. చినమూంతాచార్యులవారికి మీరు మాకు గురువులుకారని బదులువ్రాసినవారి నందఱిని భ్రమపెట్ట నిట్టి వట్టివ్రాఁతల వ్రాయుచున్నాఁడు. ఇంకను ముందుచూడుఁడు. పా॥ జగారి స్థితి సుతిమించి రాఁగానఁ బడుచున్నది.

గొల్లపూడి లక్ష్మణసోమయాజిప్రభృతుల బ్రాహ్మణబ్రువులని వ్రాయించుచున్నది.

ఈ లక్ష్మణసోమయాజిగారు చేసిన గొప్పతప్పు శ్రుతిధర్మ సంజీవిని కల్యాణానందభారతీస్వాములవారిని మిక్కిలి స్తుతించుచున్నదని యనుటయంట. ఈతప్పున కింతశిక్ష వేసినాఁడు. హరా! ఏమీ యీయన్యాయము! ఏమీ యీనోటికొవ్వు! అభినవ విరూపాక్ష పీఠమైనను సరిగా సంక్రమించుట సందిగ్ధస్థితిలోనుండ జగద్విఖ్యాత శృంగగిరి విరూపాక్ష పుష్పగిరిపీఠములను వెగటుపెట్టుచు నని వీరికి శిష్యపీఠములనియుఁ గల్పితములనియు వీరితోఁ గల్యాణా॥ స్వాములవారిని దీసికొనిపోయి యాకసమునఁ గూర్చుండఁబెట్టుట యెవరికి వెగటు పుట్టింపదు? సకలవిద్యాపారంగతులై లోకమంతయుం దలకింపఁజేయుచున్న మా చినమాంతాచార్య స్వాములవారిని శా॥ జిగారు బ్రొమ్మచెఱచుకొనుచున్నారు. ఇదియంతయు నిజమో యబద్ధమో యిపు డెవరుకానరిరి? ఇఁక నేల మమ్ము బ్రాహ్మణబ్రువులఁ జేయవలె? తక్కినవానికన్నిటికి నెట్లున్నను వీరికి నీమాంసాప్రవచనము గావించిరఁట. అంశులకుఁగా నింత వ్రాసివేసికొని మాకు భాష్యప్రవచనమొనరించిన మాంతాచార్యులని మన శా॥ జిగారు మఱిమఱిఁ గొట్టవచ్చుచున్నారు. కానిండు. ఆర్యులారా! గొల్లపూడి లక్ష్మణ సోమయాజులుగారు నాటకాలంకారసాహిత్యవంతులు. అవిచ్ఛిన్నాగ్ని హోత్రులు. అఖిలసజ్జనప్రియులు. ఇట్టిసజ్జనుని బ్రాహ్మణబ్రువుఁడనియు లచ్చన్నయనియుఁ బ్రల్లదములు వ్రాసినచేయి నేమిచేయవలెనో కూసిననోటిపై నేమిపెట్టవలయునో సుంత యోజింపుఁడు. ఇప్పటికి మూఁడువత్సరములనాఁడే కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

శ్లో॥ పాపాత్మాసి మహాత్మదూషణవశాత్, భ్రష్టోసి దుష్టాదృతేః,
చండాలోసి తదన్నపానకలనాత్, మ్లేచ్ఛోసి తత్సంగమాత్,
త్వం పాపీ యజనాదసి, ప్రపతితో నే పాకయాజిన్! భజ
ప్రాయశ్చిత్తపరో మహాత్మన ఇహ ప్రేత్యై పరస్యాత్తనే॥

అని పేర్కొనియున్నారు. కాని యిప్పటి యేతత్స్థితి యీ విశేషణములకుఁగూడ మించిపోయినది.

పుష్పగిరిపీఠాధిపతులు నిరక్షరకుక్షులని నిందింపఁజేయుచున్నది. ఇది యొక యపస్మారమువలె బయలుదేరినది. దీనికిఁ గృష్ణమూర్తి శాస్త్రిగారు చెప్పినట్లు కుక్కకాటువైద్యముదప్ప వేఱుమందు కనఁబడదు. జగద్విదితకీర్తులును మహోదారులును బరమశాంతులును నగు కాశీనాథుని నాగేశ్వరరావుగారికిఁగూడఁ జదువురాదనియు లోకజ్ఞానము సున్నయనియు వ్రాసినాఁడు. ఇట్లు ప్రతివారిని దీసివేయు వీరివిద్వత్త యెంతదో సుంత విచారించు టత్యావశ్యకమే; కాని యీ సంచిక కిక్కడికే గ్రంథము పెరిఁగిపోయినది. అందులకు మఱియొకసారి గడంగుదము. సాధువు రేఁగితేఁ దలపోలమఱపట్టించునన్న సామెతను గాశీనాథుని నాగేశ్వరరావుగారు మిన్నకుండి మిన్నకుండి యట్టె యొక్కసారి కన్ను తెఱచిరేని భస్మముగావలసివచ్చును. ఇట్టే మితిమీఱి ప్రసంగింపఁ బ్రసంగింప నెప్పుడో యంతగతి పట్టకమానదు. తపస్సంపన్నులగు పుష్పగిరిపీఠాధిపతులయెడల నుపయోగించు నవాచ్యములు గూడ సద్యఃఫలదములు కాకపోవు. యతులగు చినమాంతాచార్యుల వారు రజస్వలలై శుభకార్యమునకు సిద్ధముగానున్న యన్నను వైరాగ్యము లేకయే పీఠాధిపత్యము దొరకినఁ జాలునని విడనాడెనని లక్ష్మణసోమయాజిగారు వ్రాసినందులకుఁ బాకయాజిగారు హుంకరించుచున్నారు. "వారికి వైరాగ్యమున్నది లేనిది వీరు లోపలదూరి చూచినారాయని వెడగుప్రశ్న వేయుచున్నారు. ఇట్టివారికి వైరాగ్యమేమి తెలియునని యేతద్వ్యవహారోత్తరక్షణముననే నన్నధిక్షేపించినదికూడ నిదియేనోరు. ఇట్టి స్వవచనవ్యాఘాతములనే కనుఁగొనలేని వాచాటుఁడు పుష్పగిరిపీఠాధిపతులు నిరక్షరకుక్షులనియు నాంధ్రపత్రికాధిపతులకుఁ జదువురాదనియు నాక్షేపించుట వింతగాదు. ఇది యొక యున్మత్తప్రలాపము. శ్రీవారి కుక్షి నిరక్షరమైనదియు సాక్షరమైనదియు నీపా॥జిగారు లోపల దూఱియే చూచివచ్చిరికాఁబోలు. ఆతురసన్న్యాసము పుచ్చుకొనునది కాని యిచ్చునది కాదని లక్ష్మణసోమయాజులుగారికిఁ దెలియదనియు నిట్టివారు శాస్త్రిబిరుదము నొందులకుఁ దగిలించుకొనవలెననియు మన పండిత పా॥జగారి మఱి

యొక యాక్షేపము. ఇందులకు "ప్రాణస్యోత్క్రమణాసన్నకాల స్త్వాతురసంజ్ఞికః, నేతర స్త్వాతురఃకాలో ముక్తిమార్గప్రవర్తక" యను శ్లోకము ప్రమాణము. ఈశ్లోకము ప్రాణములు వెళ్ళిపోవుటకు సమీపించినకాల మాతురసంజ్ఞికమనిమాత్రమే చెప్పినదికాని యా ప్రాణములు సన్యాసము పుచ్చుకొనువాని వేయని చెప్పలేదు. కాఁబట్టి యిచ్చునదికూడ నాతురసన్యాసమగుటకు బాధలేదు. చావఁబోవు వాఁడు మఱియొకనిబిల్చి సన్యాసమీయవలసిన మంత్రలభాగ మేల కలుగఁజేసికొనుమని యిటుఁ బ్రశ్నింపనచ్చును.

ఇతరసన్యాసుల కట్టిభార మనవసరముగుఁగాక. పీఠాధిపతు లవసాన కాలమునఁదప్ప కీభారమువహించుకొనవలసియుండును. సావకాశముగా నాత్మలో నైక్యముకాఁబోవు పీఠాధిపతియంతయుక్రమముగ నేజరుపును. ఆకస్మికమరణముఁజెందువార లిట్లాచరింపకున్న నికనేమిగతి? కాఁబట్టి యాతురసన్యాసము దేహళీదీపన్యాయమున దీయమానాదీయమానములరెంటికిని వర్తించెడిని. సన్యాసముపుచ్చుకొనువాని ప్రాణము లేతీయవలసినపనిలేదు. విద్వాంసులారా! శా॥ జిగారి విద్వత్తను సుంత పరికింపుఁడు. "వీరు మాంతాచార్యులని వ్రాసికొనుచున్నారు. ఈ బిరుదము నిదివఱ కేపీఠాధిపతులును వాడియుండినట్లు తోఁచదు. అభక్తులు కృత్రిమః అధమః అని అర్థమైయుండునేమోయని చెప్పెడి పరిహాసవాక్యములకు సమాధానముచెప్పుట దుర్ఘటముగానున్నది యనిలక్ష్మణసోమయాజులుగారు తమయభినవవిరూపాక్షవృత్తాంతమున వ్రాసియుండిరి. ఇట్టి సులభశైలిగలపంక్తులలోని యర్థమే యెఱుంగలేక "మాంతాచార్యశబ్దమునకు అభక్తులు కృత్రిమః అధమః అని మూడర్థములుండునేమోయని సోమయాజి శంకించియున్నా" డని శా॥ జిగా రాక్షేపించియున్నారు. ఇచ్చట నిట్టియర్థము వీరి కొక్కరికే స్ఫురించెడినిగాని మఱియొకరికి స్ఫురింపదు. ఇంతపాటి తనపాండిత్యమునకు వారికిఁ జదువురాదు, వీరికిఁ జదువురాదనికూడ వ్రాయవలెను గాఁబోలు! పైన పండితులిట్లు శంకింతురా, వీరి కర్థము తెలియకున్న నడిగి తెలిసికొనవలెనుగాని యొకపండితులు వాడియున్నపదమున కిట్లు విరుద్ధార్థములు చేయనగునా" యనికూడ మొక్కరిల్లుచున్నాఁడు. ఇహిహీ "కృత్రిమః, అధమః అని సంస్కృతవిభక్తులతో నేకవచన

ములుచూపుచు మరల సభక్తులని తెలుగువిభక్తియు బహువచన
మును మన శా॥ జిగారివంటి పండితుఁడుగాక మఱి యేపండితుఁడు
చెప్పును? ఇట్టిపండితుఁ డెట్టిపండితులనైన జయించును. ఎన్ని బూతు
లైనను దిట్టును. శ్లో॥ ఏకాం లజ్జాం పరిత్యజ్య త్రిలోకీవిజయీభ
వేత్తను సభియుక్తోక్తి యూరకపుట్టదు. తనముడ్డిమీఁది గుడ్డతొలఁగి
నది కానక యెదుటిదాని పైట తొలఁగినందుల కాక్షేపించు నవివే
కినిగూడ మన శా॥ జిగారికంటెఁ గొంచె ముత్తమురాలని చెప్పవలసి
వచ్చినందులకుఁ జింతింతును. శాస్త్రప్రకారము విదండులు పీఠార్హులు
కారని సోమయాజులుగారు వ్రాసినదానికిఁ శాకయాజిగారు "ఓహో!
వీరికేదోడు శాస్త్రచర్చకూడ నొకటియా" యని పరిహసించుచు
నారదపరివ్రాజకోపనిషత్తులోని "జ్ఞానదండో ధృతో యేన ఏకదండీ
స ఉచ్యతే, కాష్ఠదండో ధృతో యేన సర్వాశీ జ్ఞానవర్జిత" యను
శ్లోకమును గనఁబఱచెను. విదండి యన జ్ఞానియఁట. సదండి యన
నజ్ఞాని యఁట! అగును గాక. జ్ఞానదండమును ధరించిన
నాఁడు కాష్ఠదండమును వదలవలెఁగాని యూరక దండమును బాఱ
వైచినంతమాత్రముననే జ్ఞాని యయ్యెనోటు. ఐతే నిఁక జ్ఞానులని యని
పించుకొనఁదలఁచినవా రందఱు జుట్టు జందెమును దీసివేసి వెంటనే దం
డముగూడ నవల వైచవచ్చును. ఆశ్రమధర్మముల నుజ్జగించి యథేచ్ఛ
మైఁ దిరుగనిండు, స్త్రీలతో సరససల్లాపములాడుచుఁ జుట్టుఁ గూర్చుం
డఁబెట్టుకొననిండు, లోకుల నందఱిని దెగఁదిట్టనిండు. ఏమిచేసితేనేమి.
దండము నవలఁబాఱవైచినచో జ్ఞాని యైపోయెనఁట. ఇట్టిచో నిన్ని తెలి
సిన శా॥ జిగారు గూడ జ్ఞానిగాక యధఃపతితుఁడయ్యెనో యేలయుండ
వలసెనో బోధపడినది కాదు. సదండయతులారా! మీరు ప్రాపంచిక
సుఖముల రోసి ముముక్షులై గాషాయదండముల ధరియించితిరి కాని
నంబిత్వం నైవముంచ తేయను రీతి మీ యజ్ఞానము మిమ్ము విడువలేదు;
ఇట్లని మా శా॥ జిగారు చెప్పుచున్నారు. లెండు. దండముల నవలఁ
బాఱవేయుండు. మాంతాచార్యులు కండు. మమ్ములఁ దిట్టుండు-లక్ష్మ
ణసోమయాజులుగారును శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రిగారును
నేనును మము బోంట్లు మఱికొందఱును బ్రాహ్మణబ్రువులమని శా॥ జి
గారు ప్రమాణమును జూపకయే పలికియున్నారు-"యతీనాం కోపి

చండాల స్సర్వచండాలదూషక" యను నాబాలగోపాలము వాడుకొనెడి ప్రమాణమునకు వారును వారిగురువులును గుఱికాకమానరు-వానకుఁదడియనివారును బాకయాజిగారిచే దూషింపఁబడనివారును లేరనుట జగద్విదితము-గురువుగారికోపము దేశమెల్లెడఁ జుట్టవేసికొని వచ్చుచుండుట ప్రత్యక్షము. ఉత్తములగు పండితులే శ్రుతిధర్మసంజీవని విమర్శనల కలరి స్తుతించుచున్నారని పా॥ జిగారు మురియుచున్నారు. పాపము మురిపెముతీఱుకాల మాసన్నమగుట యెఱుఁగరైరి. వారిని బ్రతిమలాడియు వీరినిబ్రతిమలాడియు సదభిప్రాయములు వ్రాయించుకొని ప్రకటించుకొను దినములు గడచిపోయినవి-తులసియుండఁగలూడిపడునట్లు వీరుచెప్పు ధర్మప్రశ్నముల విని కొంద ఱిదివఱకు భ్రమపడియున్నను క్రమముగాఁ దత్త్వముం గనిపెట్టుచున్నారు-వీరి వ్యాసముల కలరి స్తుతించిన యుత్తమపండితుల నందఱిని ప్రస్తుతము పేర్కొనఁజాలనుగాని ముదిగొండ నాగలింగశాస్త్రిగారిని వేమూరి శివస్వామిశాస్త్రిగారిని శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిని మాత్రము కీర్తించి విడుతును. కావలసియున్నఁ గాలాంతరమునం దందఱిలిస్టు నీయవచ్చును.

వారు వ్రాసిన యభినవవిరూపాక్ష వృత్తాంతములోని యంశముల నేనిని ఖండింపనేరక యెక్కడనో యొక్కముక్క యక్కఱకుమాలినది చిక్కించుకొని వెక్కిరించి చివరకు "ఎందులోను జేరని మన లచ్చన్నసోమయాజి సంజీవనిని విమర్శించుటకూడ నొకటియా" యని లక్ష్మణసోమయాజిగారి నీసడించుచు నిఁక నభినవసరస్వతిని విమర్శించుకొందమని పా॥జిగారు మావంకకు మరలినారు. ఇఁక నేమిచేయుదు. బయమగుచున్నది. కానిండు జోటిలోఁ దలకాయఁ బెట్టి రోఁకటిపోటులకు వెఱవనేటికి? అందులకు మఱియొక వాయిదావేసి పా॥జిగారి ప్రల్లదములకుఁ బ్రత్యుత్తరమీయ సిద్ధముండువాఁడ. ప్రాజ్ఞులారా! పా॥జగారి ప్రల్లదముల నణంచుటకుఁగా సహజమృద్వీయగు నస్మద్వాచోధోరణిని మార్చుకొని గుజ్జము గాడిద సమానమను సామెతకు గుఱియైనందులకు నన్ను మన్నింపుఁడు. ఏఱోటిదగ్గర నాపాటఁబాడకున్న వీలులేదు. శ్లో॥ కథాపి ఖలు పాపానా మలమశ్రేయసే యతః॥ అను సూక్తిననుసరించి యీనాఁటికైన సింతతో విరమింతము.

# పోతనామాత్యకవికృత శ్రీమదాంధ్రభాగవతము.

## ప్రథమస్కంధము.

ఉ॥ ఫాలము నేలమోపి భయభక్తులతోడ నమస్కరించి భూ
పాలకులోత్తముండు గరపద్మములన్ ముకుళించి నేఁడు నా
పాలిటిభాగ్యమెట్టిదియొ పావనమూర్తివి పుణ్యకీర్తి వీ
వేళకు నీవువచ్చితి వివేకవిభూషణ! దివ్యభూషణా! గ.౨౧

మ॥ ఎలమిన్ మేనమఱందియై సచివుఁడై యేనుటి మాతాతలన్
బలిమిం గాచి సముద్రముద్రితధరం బట్టంబు గట్టించె న
య్యలఘుం డీశుఁడు చక్రి రక్షకుఁడు గా కన్యుల్ విపద్రక్షకుల్
గలరే వేఁడెద భక్తి నాగుణనిధిం గారుణ్యవారాంనిధిన్॥ గ.౨౨

వ॥ ఈపద్యముల ద్వారమునఁబరీక్షిన్మహారాజు శ్రీశుకులవారిని గుఱించి శ్రీకృష్ణమూర్తి తమ యాపత్తుల నన్నింటిని దొలఁగింపఁజేసి నాఁడనియుఁ దన తాతలగు ధర్మరాజాదులకు బంధువుఁడై సచివుఁడై పట్టంబుగట్టించెననియు నట్టియాపద్రక్షకుఁడగు మాకృష్ణుని ప్రశంస విస్తరించిచెప్పుమనియుఁ బ్రేమపూర్వకముగా నడుగుటవలన శ్రీశుకులు మఱింతగా శ్రీకృష్ణభగవానులను శ్లాఘించిరి. అంతియకాని పరీక్షిద్రాజు ప్రప్రథమములో భవబంధవిముక్తికొఱకై కాని యేయుపాయముచే నపవర్గము లభించుననికాని యొక్కసారియైనను నడిగినటులఁదెలియుచున్నదికాదు. మరణమునకు సంసిద్ధుఁడై యత్యంతభీతచేతస్కుఁడై పశ్చాత్తాపతప్తుఁడై యుండి యెటుఁదోఁపక శ్రీకృష్ణమూర్తియే యీమహావిపత్తునకు శరణ్యుఁడనియెంచి నుడి తడఁబడుచు నుండఁగాఁ బ్రశ్నించెను. అందుకుఁ దగినట్లుగనే యీపురాణమును వినినమీఁదటఁగూడనుత్తమలోకప్రాప్తికలుగనటుల వ్యాసముఖమున వెల్లడియగుచున్నది.

జనమేజయమహారాజు ప్రశ్న - దేవీభాగవతము ద్వి॥ స్కం॥

తే॥ క్షత్రియుండగువానికి సంగరమున
గాని గృహమునందుగాని యుక్తమగురీతి
మరణ ముత్తమ, మారీతి మరణ మబ్బ
దయ్యె, మజ్జనకునకు సౌఖ్యంబు గలదె ?॥

కం॥ కావున మజ్జనకునకు సు
ఖావిర్భావంబు పరమునందొదవునటుల్
శ్రీవర్ధిల్లగ సదుపా
యావహముగదాని నాకు నానతిమీవే ?

వ॥ అని ప్రార్థించు జనమేజయునకు వ్యాసుం డిట్లనియె.

ఉ॥ పాపహరంబు మోక్షదము భద్రకరంబు పురాణరత్నమున్
ధ్యాపకశిష్యనిత్యసుఖదంబగు భాగవతంబు మత్సుతుం
డోపి పఠించె, నయ్యది మహోత్తమ, మాగమసార, మాత్మసం
తాపహరంబు, దాని వినినం దదముట్టు సమస్తమున్ నృపా !

చతుర్థస్కంధము.

మ॥ ఘనసంగ్రామము పుణ్యక్షేత్రము గంగాతీరమో గాక నీ
జనకుం డున్నతసౌధరాజమున దుస్సర్పమ్ముచే దుర్మృతిం
గని ఘోరమ్మగు రౌరవమ్మునఁబడెం గాళీమహాయజ్ఞసం
జనితానంతవిశేషపుణ్యమున నుచ్చైర్లోకముం గూర్పుమా ॥

ఇట్టి జనమేజయమహారాజును గురించి వ్యాసముఖప్రబోధితములయిన ప్రశ్నోత్తరములనుండి యీదేవీభాగవతమునుండియే పరీక్షిద్రాజునకు నరకోద్ధారణ మయినదని తెలియనయ్యెడిని. అయితే

శ్లో॥ "శ్రీమద్భాగవతంనామ పురాణం బ్రహ్మసమ్మితం
భక్తిజ్ఞానవిరాగాణాం స్థాపనాయ ప్రకాశితం
సాశ్చర్య మేతత్ కథితం కథానకం
జ్ఞానాది ధర్మాన్ వినిగూహ్య సాంప్రతం॥
నిశ్రేయసే భాగవతం పురాణం
జాతం శుకాత్ యోగవిదాదిసూచితం"

అను విష్ణుభాగవత శ్లోకములును "శ్రీమద్భాగవతం పురాణ మాతులం" అను పద్మపురాణశ్లోకమును విష్ణుభాగవతమునకుం బ్రాశస్త్యమును బోధించుటలేదా యని విపక్షులు శంకింపవచ్చును. ఈశ్లోకములు రమారమి శతస్ఫూర్తికిం ద్వితీయాంశ ముండవచ్చును. ఇంత మాత్రముచే మహాపురాణమని చెప్పుటకు వీలులేదు. దేవీభాగవతాంతర్గత శ్రీకృష్ణచరిత్రను సంగ్రహించి చెప్పుటవలన నుపపురాణమై విలసిల్లుచు వైష్ణవులకు మాత్రమే యుపయోగమగుచున్నది గాని మహాపురాణత్వము సిద్ధింపనేరదు. కావున దేవీభాగవతమే మహాపురాణమనియు మోక్షమునకు ముఖ్యసాధనమనియు సప్తాహాది మహాకార్యములయం దద్వైతమండలిచేఁ బ్రాముఖ్యముగాఁ బఠనీయమనియు మున్నాటికిం జెప్పఁబడియున్నయది. ఈదేవీభాగవతమే యద్వైతగ్రంథమని స్కాందాదిపురాణములనుండి కొన్ని ప్రమాణముల నిదిగువ గనఁబఱచుచున్నవాఁడను.

సూతమహర్షిని గుఱించి శౌనకప్రశ్న.

స్కాందపురాణము. మానసిక ఖండము. దేవీభాగవతమాహాత్మ్యము.

ప్ర॥ స్కం॥ ౧ వ యధ్యాయము.

శ్లో॥ అధునా శ్రోతు మిచ్ఛామః పావనాత్పావనం పరం
భక్తిముక్తిప్రదం నౄణా మనాయాసేన సర్వశః ౬

తత్త్వం బ్రూహి మహాభాగ యేన సిధ్యంతి మానవాః
కలావపి పరం త్వత్తో నవిద్మ స్సంశయచ్ఛిదం ॥ ౭

సూత॥ సాధుపృష్టం మహాభాగా ! లోకానాం హితకామ్యయా
సర్వశాస్త్రస్య యత్సారం త ద్వో వక్ష్యామ్యశేషతః ౮
దేవీభాగవతం తత్ర పురాణం భోగమోక్షదం
స్వయంతు శ్రావయామాస జనమేజయభూపతిం ౯
పూర్వ మస్య పితా రాజన్ పరీక్షి త్తక్షకాహినా
సందష్ట స్తస్య సంశుద్ధ్యై రాజ్ఞా భాగవతం శ్రుతం ౧౯
అష్టాదశపురాణానాం మధ్యే సర్వోత్తమం పరం
దేవీభాగవతంనామ సర్వకామార్థమోక్షదం ౨౦
పఠన్ ద్విజో వేదవిదగ్రిణీ ర్భవేత్
బాహుప్రజాతో ధరణీపతి స్స్యాత్
వైశ్యః పఠన్ విత్తసమృద్ధి మేతి
శూద్రోపి శృణ్వన్ స్వకులోత్తమ స్స్యాత్ ॥ ౨౧

3 అ॥ 2 శ్లో॥ దేవీభాగవతంనామ పురాణం యత్తు పంచమం
భగవత్యా ఇదం యస్మా త్తస్మా ద్భాగవతం విదుః

అయ్యా ! ఈసూతశౌనకసంవాదమునుండి మోక్షార్థమై శౌనకుఁడు ప్రశ్నించినట్లును దేవీభాగవతమే మోక్షకరమైన గ్రంథమని సూతుఁడు చక్కఁగా నిష్పక్షపాతముగా వెల్లడించినట్లును దెల్లమయ్యెడిని. ఈక్రిందిశ్లోకములను జూడుఁడు;

౪ అ॥ దేవీభాగవతంనామ పురాణం పరమోత్తమం
పంచకృత్వస్తు త చ్ఛ్రుత్వా లప్స్యసేఽభిమతం సుతం ౨౭

౫ అ॥ ప్రేష్యా యత్నేన వార్తేయం దేశేదేశే జనే జనే
ఆగంతవ్య మిహావశ్యం కథా దేవ్యా భవిష్యతి॥ ౪

వ॥ అని వక్కాణించుటయు జనకుండును బురవాసులును వేఱువేఱఁ బ్రశంసించుచు గృహంబులకరిగిరి, యాపె త్రివిక్రమప్రతిమయు మహేశ్వరలింగంబును బ్రతిష్ఠించి భిక్షాన్నకృతభోజనంబునఁ దపంబుండుచుఁ జమత్కారపురస్థ సర్వజనంబులచేతం బ్రశంస్యమానయయ్యె" నని యిట్లు సూతుండు వచించుటయు మునులిట్లనిరి.

## —• రైవతేశ్వరవర్ణనము, క్షేమంకరీప్రభావము. •—

కం॥ "సౌరాష్ట్రమునకుఁబతియై తా రైవతుఁడన జనించుఁ దక్షకఫణి, త
న్నారియు క్షేమంకరినా ధారుణి నానర్తపతికిఁ దనుజాతయగున్" ౨౦

కం॥ అని మును సంక్షేపంబుగ వినిచితివి, సకృత్స్నముగను వినుటకునై మా
మనములు వేడుకపడియెడు, ననఘా ! దయయుంచి చెప్పు మద్దాని వెసన్, ౨౧

కం॥ కేదారము హిమవంతమునొదలఁ గలదనుచు విందు, మయ్యది యెటు త
ద్భూదైవతాగ్రహారములోఁ దనరెడు ? సంశయంబులోఁబడె మనముల్" ౨౨

వ॥ అని యిట్లు ప్రశ్నించుటయు రోమహర్షణి మఱియునిట్లనియె, ౨౩

కం॥ "ఇక్కడ మత్పితృముఖమునఁ జక్కగ శ్రవణించియున్న సకలంబును నే
వక్కాణించెద వినుఁడు మఱొక్క మనోవృత్తిలేక యోగివరేణ్యుల్ ! ౨౪

వ॥ తొల్లి భట్టికాశాపంబునఁ దక్షకుండు సౌరాష్ట్రాధిపతి హర్మ్యంబున రైవతుండునాఁ బ్రభవించె, నానర్తదేశాధీశునకును నొక్కపుత్రిక గలిగి క్షేమంకరియను సార్థకనామంబునఁ బ్రఖ్యాతయయ్యెఁ, బూర్వ మానర్తాధిపతియై ప్రభంజనుఁడను నొకఁడుండ నాతనికిఁ బెక్కండ్రురాజులతో విరోధంబు సమకూరె, నంత నాశత్రువులు దేశమును హరించియుఁ బశువులఁ దమదేశములకుఁ దోలించియు రేయుంబవల్సు సంగరంబునకుఁ దలపడఁ గొన్నిదినంబులకుఁ దద్భార్య ప్రియంవదయనునది ఋతుస్నాతయై గర్భంబుధరియించె, నాఁటగోలెఁ బురంబునకును రాష్ట్రంబునకును క్షేమంబు గలిగె, దుర్జయులయ్యును గొందఱుపగతు రతనిచే జయింపఁబడిరి, కొందఱు చంపఁబడిరి, కొందఱు మైత్రిచేసిరి, పదపడి యాప్రియంవదకుఁ బద్మాయతేక్షణయగు నొక్క కన్యక యుదయించి యంధకారబంధురంబగు సూతికాగృహంబును బ్రకాశింపఁజేయుటయు నాపార్థివుండు పరమసంతోషంబున గీతవాద్యాది మంగళధ్వనులతోఁ బుత్రినమంబోలె నుత్సవం బొనరించి త్రయోదశదివసంబున బ్రాహ్మణసన్నిధిని గర్భమునఁ బ్రవేశించినదిమొదలు క్షేమాపాదకయగుటంజేసి క్షేమంకరియని నామంబు విధి

యుంచె, నిట్లు పొగడ్తకెక్కి గగనాంగణంబున శుక్లపక్షీయ చంద్రకలవిధంబున దిన దినాభివృద్ధిఁజెంది యౌవనోపేతయగుటయు శుభముహూర్తంబున సౌరాష్ట్రనాథుండగు రైవతున కక్కన్నియనిచ్చి వివాహంబుసేయ నాదంపతులకు యశస్వినియగు శేషపత్ని భట్టికాశాపంబున దేవతినాఁ బ్రభవించి రాసురూపుఁడగు నాగరాజుచేఁ బరిణీతయై పుత్రపౌత్రవతియు సౌభాగ్యమదగర్వితయు నయ్యెంగాని వయోధికులయ్యు నాయమ తల్లిదండ్రులు పుత్రవంతులు గాకునికికిఁ జింతింపనేసినవారలైరి, యంత నాదంపతులు రాజ్యంబు పెద్దల కొప్పఁజెప్పి తపోర్థినై హాటకేశ్వరక్షేత్రంబున కరుదెంచి యా శ్రమంబు గట్టుకొని వింధ్యాచలంబునఁ గౌమారవ్రతధారిణియై మహిషాసురవధించిన కాత్యాయనిం బ్రతిష్ఠించి తదారాధనతత్పరులగుటయు నాయమ సంతుష్టయై క్షేమ జిత్తను నొకతనయుని దయసేసె, నంత నారాజు మరల రాజ్యంబుగైకొని మహాసంతో షంబునఁ గొడుకుం బెంచుకొని ప్రాయంబురా శత్రుపక్షక్షయావహుండగు నాతని రాజ్యంబునఁ బట్టాభిషిక్తుంజేసి భార్యతోఁగూడ మరల నీక్షేత్రంబున కరుదెంచి శివ లింగంబును స్థాపించి దేవళంబుగట్టించె, నాలింగంబు దర్శనమాత్రంబున సకలదేహు లకును బాపనాశకంబగుచు రైవతేశ్వరమనఁ బ్రసిద్ధమయ్యె, క్షేమంకరియుఁ దొల్లి తద్భూభుజునిచే స్థాపింపఁబడిన మహిషాసురమర్దనికి శ్రద్ధాభక్తులతో గుడి కట్టించి కొలుచుచుండుటయు నదిమొదలాయమ క్షేమంకరినాఁ గీర్తింపఁబడియెఁ, జైత్రశుక్లా ష్టమీదినంబున నెవఁ డాయమను దర్శించు వాని యభీష్టసిద్ధియయ్యెడు"నని యిట్లు కీర్తించుటయు వెండియు నమ్మహర్షులు

## —♦ దేవసేనాపరాజయము ♦—

తే॥ "నీవుచెప్పిన కాత్యాయనీసమాఖ్య తాను మహిషాంతకరి యెవ్విధమునసయ్యె?
నెట్టిఁ డామహిషాసురుఁ? డెందుకొఱకు హతుఁడు గావింపఁబడియె నయ్యంబచేత?"

వ॥ అనియడిగిన సూతుండు ౮౭

కం॥ "ఈవిషయంబున మీ కో భూవిబుధులు! శ్రవణమాత్రమున నఘహరమౌ
పావనదేవీమహిమము నేవక్కాణింతు వినుఁడు నిశ్చలమతులై, ౮౮

వ॥ మహిషాసురుండు హిరణ్యాక్షుని సుతుండై మహిషరూపంబున జగత్త్రిత యంబును ననుభవించె"నని వాక్రుచ్చుటయు నమ్మునీశ్వరులు మఱియునిట్లనిరి, ౮౯

తే॥ "మొట్టమొదలే లులాయమై పుట్టినాఁడొ, లేక యేదేనిశాప మానాకివైరి
కేరుపడియె యటులయ్యెనో, యుద్ధియంతయును సవిస్తారముగఁజెప్పు మోమహాత్మ!" ౯౦

వ॥ అని యిట్లు ప్రశ్నింప రోమహర్షణి మతియునిట్లనియె, ౯౧

సీ॥ "వెడవిల్తునకుఁగూడ వ్రీడాకరంబౌచుఁ జూడ్కికింపగు మేనిసొబగుగలిగి
పురుషోత్తమునితోడఁ బోల్పంగ నమరెడుఁ గమలాయతమ్ములైన కనులుఁగలిగి
మోకాళ్ళపర్యంతమును సాగియుండిన యురుతర దీర్ఘబాహువులుఁగలిగి
కంబుసమానంబుఁ గమనీయతమమునై కనులకింపగు పెద్ద గళముఁగలిగి
వీర్యముం దేజముంగూడ వెలయఁగలిగి చిత్రసముఁడన్న పేరఁ బ్రసిద్ధిగలిగి
యఖిలలక్షణలక్షితుండయియు తాను మొట్టమొద లాసురారాతి పుట్టియుండె, ౯౨

వ॥ వాఁడు చిన్నతనమునుండి యశ్వాదివాహనంబుల నన్నిటిం ద్యజించి మహిషంబులనెక్కితిరుగుట కలవాటుపడినవాఁడై యొకప్పుడు జాహ్నవీతీరంబున జలపక్షులం బోలియించుచు బుద్ధిశూన్యత్వమై నున్నతపద్మాసనంబున సమాధిస్థుఁడైన దుర్వాసుండు వేగవశంబున మహిషఖురంబులచే క్షుణ్ణుండగుట చూడకుండుటయు క్షణజదిగ్గాంగుండగు నమ్మునిచంద్రుండు ప్రణామరహితుండగు నాదానవ్వుం గనుంగొని క్రోధపరీతుండై దోయిటం దోయంబుల గ్రహియించి ౯౩

ఆ॥ "పాపవర్త్మ! మహిషపదతాడనములచే నొడలు బ్రద్దలయ్యెఁ,జెడె సమాధి,
కానఁ బూర్వమున్న జ్ఞానంబుతోడను మహిషరూపమునను మనుము పొమ్ము" ౯౪

వ॥ అనిశపించుటయు నయ్యసురుండు కృష్ణగాత్రధరంబును నతిదీర్ఘవిషాణంబును నంజనాద్రితులితంబును నగు మహిషంబై "బాల్యభావంబున నెఱుంగక చేసిన యపరాధంబును క్షమింపు"మని సవినయంబుగాఁ బ్రార్థింప నమ్మునిపర్యుండు ౯౫

కం॥ "అనృతంబుగాదు నానుడి,యనువునఁ బ్రాణంబులుండుదాఁకను నీవి
ట్లైనముగనే పడియుండుచు మను మేటికిఁ దక్కువెక్కుమాటలతోడన్" ౯౬

వ॥ అనిశపియించి గంగాతీరంబునుండి యొండెడకు నడచుడు వాఁడును క్రమ్మఱ
కడ కరిగి ౯౭

తే॥ "నేను దుర్వాసుఁడను పేరి మౌనిచేత నొక్కకారణమున శాపమొసఁగి మహిష
ముగను గావింపఁబడితి,నీముప్పుదప్పఁ జొప్పువిధియింప దిక్కువై శుకర్త్రి! నాకు" ౯౮

వ॥ అనివాఁడు ప్రచ్చిన నతండిట్లనియె, ౯౯

ఆ॥ "అమ్మునీశుశాప మన్యథాయొనరింప నీశుఁడొకఁడునక్క సెవఁడుశక్తుఁ?
డఖిలసిద్ధులొసఁగు హాటకేశ్వరమున కరిగి లింగమునకు నర్చనలుప్రు, ౧౦౦

క॥ అచ్చటం గలియుగమున నే చెచ్చెర నఖిలేప్సితములు సిద్ధించు, నిదో
సచ్చరితము ప్రథమయుగం,బిచ్చో నీయిష్టమెటుల నీడేరదిఁకన్" ౧౦౧

వ॥ అనియిట్లుపలుకుటయు ద్వరితంబ హాటకేశ్వర క్షేత్రంబున కరిగి యచట శివ లింగంబుం బ్రతిష్ఠించి కైలాసశిఖరోపమంబగు దేవళంబుగట్టించి పెద్దకాలంబు తద్దయుఁ దపంబొనరింపఁ బరమేశ్వరుండు ప్రత్యక్షుఁడై వరంబడుగుమనిన నద్దానవుండు ౧౦౨

క॥ "నేను శివా! దుర్వాసోమానీంద్రునిశాపమునను మహిమత్వంబున్
బూని కృశించుచునుంటిని, దాని వినాశనముచేసి దయ నేలఁగదే" ౧౦౩

వ॥ అని ప్రార్థించిన భగవంతుం డిట్లనియె, ౧౦౪

ఉ॥ "అమ్మునివాక్య మెట్లు నయథార్థమొనర్ప నశక్య మేరికిన్,
సమ్మతమౌ నుపాయమును జక్కఁగఁ జెప్పెద నాలకింపు, మ
ర్త్యమ్మగు దేవదైత్యమనుజాదికసౌఖ్యములెల్ల నీ శరీ
రమ్మున నీకు భోగ్యములు రాక్షసరాజ! యిఁకేలచింతిలన్, ౧౦౫

క॥ భోగార్థము సుర లసురులు బాగుగ నరతనువుదాల్పఁ బ్రియతింతురు, తె
ద్భోగంబులెల్లఁ గుడుచుచు నీగాత్రముతోన యుండుమిదె దనుజేంద్రా!" ౧౦౬

వ॥ నావుడు నమ్మహిషాసురుండు ౧౦౭

సీ॥ విద్యాధరాదికవిఖ్యాతచారిత్రయుతదశవిధదేవయోనులకును
సర్వసర్వంసహాచక్రనియంతలై యొసఁగుచుండెడి మానవేంద్రులకును
విషవహ్నికీలల విశ్వమంతయుఁ గాల్పఁజాలిన యాశీవిషంబులకును
నాత్మీయబలనిర్జితామరేంద్రుండైన పన్నగాశనుఁదొట్టి పక్షులకును
బదచతుష్టయమునఁ బరఁగు తిర్యగ్జంతులకును జంపరాక లలిఁజెలఁగుత
మీ మదీయదేహ మెంతయు భోగంబు లోజ ననుభవింప నుండెనేని" ౧౦౮

వ॥ అనవుడు పెండియు భగవానుం డిట్లనియె, ౧౦౯

క॥ "ఒక్కఁడుగూడ ధరాస్థలిఁ జిక్కఁ డవధ్యుండు దైత్యశేఖర! యెపుడున్,
నిక్కమిది, గాన నెవరికో యొక్కరికిని వధ్యుఁడగుట కొప్పఁగవలయున్" ౧౧౦

వ॥ అని యిట్లుపలుకుటయు నయ్యసురుండు పెద్దయుంబ్రొద్దు యోజించి ౧౧౧

చం॥ "ఒక యబలాజనంబునకు నొక్కెడ వధ్యుఁడనైన నాదుఁగా,
కిఁక నెటువంటివారికిని నెప్డు నవధ్యుఁడఁ గావలెం బ్రభూ!

సకలుషుఁడేని శ్రద్ధమెయి స్నానముసేసి మదీయతీర్థమం
దోకపరి నిన్నుఁగాంచ మదినుండినకోరికి తీర్చి ప్రోవనా, ౧౧౨

కం॥ సర్వోపద్రవనాశనపూర్వకముగఁ దేజు వృద్ధిఁబొందించుచు నీ
గుర్వనుకంప యతనిపైఁ బర్వం జేయంగవలయుఁ బ్రమథగణేశా ! " ౧౧౩

వ॥ అనివేఁడుటయు భగవానుండు మఱియునిట్లనిరెు, ౧౧౪

తే॥ "మార్గశుక్లచతుర్దశి మహితభక్తి నీదుతీర్థంబునం గ్రుంకి నాదులింగ
మీక్షణముచేయఁ గల్గుచో నాక్షణమ శమించు భూతాదికృతమైన మేటివ్యథలు"

వ॥ అనియిట్లుచెప్పి యదర్శనంబుఁ జెందుటయు మహిషుండును స్వస్థలంబున కరిగి
రక్కసుల నందఱి నొక్కెడఁగూర్చి బిలిపించి సహోదర్షంబున నిట్లనియె,

ఉ॥ "మత్పితయుం బితృవ్యుఁడును మత్కులసంభవులైన పెద్దలున్
దత్పురుషోత్తమాది విబుధప్రకరంబులచేతఁ ద్రోల్లి సం
పత్పరిణాశపూర్వముగ మన్నిగొనంబడినారు కాన నా
పత్ప్రదతం దదీయమగు భాసురలోకములన్ హరించెదన్" ౧౧౬

వ॥ అని యిట్లుపలుకుటయు నద్దానవులు ౧౧౭

శా॥ "యుక్తంబియ్యది, యస్మదీయమగు నీయుద్యోగమున్ శత్రుఁడ
వ్యక్తుండై యొనరించుచుండుటను వే యందేగి యాత్మీయ దో
శ్శక్తిన్ సర్వసుపర్వులన్ గెలిచి యా స్వర్లోకసౌఖ్యంబు లా
సక్తింజేసి భుజించుచుండ మచటన్ సౌఖ్యంబుగా నోప్రభూ ! ౧౧౮

వ॥ అని మంత్రినిశ్చయం బొనరించి సభృత్యబలవాహనంబుగా మేరుశృంగంబున
కరుగుటయు శస్త్రాస్త్రసంయుతంబుగా నాకస్మికాగతంబగు నద్దానవబలంబును బొడ
గాంచి యింద్రాదిదేవతలును వసురుద్రవిశ్వేదేవసాధ్యసిద్ధవిద్యాధరాదులును యుద్ధా
ర్థము స్వపురద్వారంబునకు బయలువెడలిరి, పదపడి మృత్యువును ముందరనిడికొని
యొకరినొకరు భర్త్సించుకొనుచు సురాసురులు సమరంబున కుపక్రమించి వర్షత్రయంబు
వఱ కవిచ్ఛిన్నంబుగా సాగించుచు రక్తంబు నదులైపాఱె, నట్టిసంగరంబున నొక్క
నాఁ డైరావణారూఢుండును శ్వేతాతపత్రచ్ఛన్నశిరస్కుండును దివ్యశస్త్రాస్త్ర
పాణులగు దేవతలచేఁ బరివృతుండును నగు దేవేంద్రున కెదురునడచి దనుజాధిపుండగు
మహిషాసురుండు రోషావేశంబునఁ దీక్ష్ణతరంబులగు శృంగంబుల నైరావణంబు
రొమ్మునఁ గ్రుమ్మటయు నయ్యది ఘోరంబుగా నఱచి పరాఙ్ముఖంబై యంకుశ

ప్రహారంబులఁ గుంభస్థలం బఱపఱలగునట్లు మావటీనిచే నరకట్టఁబడియు నమరావతీ పురంబునకుఁ బాఱిపోయె, నంత క్ష్వేళనాస్ఫోటనాదులచే గర్జించుచున్న రక్షోవీరులను గర్వితుండగు మహిషునిం దిలకించి సహస్రాక్షుండు ౧౨౦

తే॥ "రాక్షసాధమ ! యప్పుడె పురందరుండు మడిసెననుచుఁ దలంపకే వెడఁదలోన,
నే నధిష్ఠించినటువంటి యిభవతంస మవశమై యుద్ధభువినుండి యరుగుచుండె, ౧౨౧

ఆ॥ కాన నొకముహూర్తకాలంబు నిలునిలు, మిదిగొ రథమునెక్కి యేగుదెంతు,
నిశితబాణములను నీదర్పమెల్ల నడంగఁజేతు, నేల బొంగిపడెదు" ౧౨౨

వ॥ అని వాక్రుచ్చుచుండ సారథియగు మాతలి వాయువేగంబులగు పదివేల గుఱ్ఱంబులతోఁ దే రాయితంబుచేసి కొనితెచ్చుటయుఁ దత్కశాఘాతంబుల కా యశ్వంబు లాకాశంబున దుముకుచుం బరువులెత్తె, నంత నయ్యింద్రుండు క్రోధమూర్ఛితుండై క్రిమ్మఱ సాహాయంబులఁ దఱిమించుటయు నయ్యసురుండు తన కొమ్ములచే బలుమాఱు వానింగూడఁ బొడిచి క్షతవక్షసంబులుగను రక్తప్లావితసర్వాంగంబులుగను బొనరించి యైరావణమార్గంబునే పట్టించె, నంత విముఖంబగు నింద్రరథంబుం బొడగాంచి వేల్పులెల్లరును భీతులై తన్మార్గంబున ననుసరించిరి, యట్లు భంగపాటొందిన వారలపై రక్కసులు మేఘంబులుంబోలె గర్జించుచు శరవృష్టిం గురియుటయు నంతలోఁ పలఁ దమసావృతంబయి రజనియు నేతెంచె, నయ్యెడ నొకవస్తువును దృష్టిగోచరంబు గాదయ్యె, నంతఁ బూర్వదేవులందఱును రణంబునుండి మరలి మేరుశృంగం బాశ్రియించి విజయమూలంబగు నానందంబునం బొంగుచు యుద్ధంబు కనులఁగట్టినట్లు వార్తలం జెప్పుకొనుచు సుఖంబుండిరి, ప్రహారంబుల క్షతవిక్షతులగు బృహస్పతి ప్రముఖ దైవతంబులు మహోత్సాహంబున నొండొరులు గలసికొని ౧౨౩

సీ॥ "దనుజహంతకుల పెక్కుదాడి కాఁగఁగ లేక వెనుకంజవైచెడి మనదుసేన,
పవిభంగి పడివచ్చి పైఁబడు శరములం జిల్లులువడియుడి నెల్లరొడళ్ళు,
లుత్సాహమనునది యొకయింతయును లేక వెలవెలపోయె నీవేల్పుమూఁక,
రణభూమి నిఁక మీఁద క్షణకాలమేనియు నిలఁజాలకుండుట నిశ్చయంబు,
కాన మనమందఱముగూడఁ గదలి యిపుడు వేగ నమరావతీపురి విడిచిపెట్టి
బ్రహ్మయింటికిఁ జనుద, మప్పదమునందుఁ గలుగ దెపుడును నసురులవలని భయము"

వ॥ అని నిశ్చయించుకొని సురపురిని శూన్యంబొనరించి బ్రహ్మలోకంబున కరుగుటయు నారాక్షసులు ప్రొద్దుపొడుపునలేచి ప్రహర్షితులై సర్వశూన్యంబగు శక్ర

పురిం బ్రవేశించి తదీయంబగు స్థానంబున మహిషాసురు నధిష్ఠింపించి మ్రొక్కులొనర్చి
మహోత్సవంబు నిర్వర్తించి దేవతాభిమతుల వసతులం జొచ్చి తదర్హంబులగు యజ్ఞ
భాగంబుల గ్రహింప మొదలిడిరి, ౧౨౫

## —: కాత్యాయనీ జననము. :—

చ॥ మహిషుఁ డటుల్ జయించి తనమాటకు రెండవమాటలేకయే
యహీనరవిష్టపంబులును నాక్రమణంబొనరించి మించుచున్
రహిఁ గనుపట్టు వారణతురంగపురోగ మనోజ్ఞవస్తురా
జిని హరియింపఁజొచ్చె, నిఁకఁ జెప్పెడిదేమి తదీయదౌష్ట్యమున్, ౧౨౬

వ॥ అట్లతండు పరివర్తించుచుండుటయు సవాసవులగు దేవత లొకచో మిళితులై
తద్వ్యథకై చింతింప మొదలిడిరి, యట్టిచో మునిసత్తముండగు నారదుం డరుదెంచి మహో
త్కటంబగు తన్మాహిషవ్యవహారంబంతయు నాలోకించి లోకత్రయపరిపీడనంబగు
వానిచేష్టితంబంతయు సవిస్తరంబుగా వక్కాణించుడుఁ దత్సురల కోపంబు క్రమ్మఱ
మఱింత పెచ్చు పెరిఁగి వక్త్రద్వారంబులవలన వెలువడి తత్క్షణంబ దెసలన్నింటనిండఁ
గావురుగప్పినట్లయ్యె, నంతలో నచ్చోటికిఁ గార్తికేయుండు చనుదెంచి ౧౨౭

కం॥ "దిక్కుల యన్నిటియందును నెక్కుడు కాలుష్య మొదవె, నేటికి సురలి
ట్లొక్కుమ్మడిఁ గోపంబును ముక్కుల నెక్కించి? యమరమునివర ! చెప్పుమా" ౧౨౮

వ॥ అనిప్రశ్నించిన నారదుండిట్లనియె, ౧౨౯

కం॥ "దనుజులవృత్తాంతంబును బనివడవచియించినాఁడఁ బ్రస్తుతమునఁ, ద
ద్దనుజుల మదాతిశయమున ననయము ముల్లోకములును నలమటపడెడిన్,

కం॥ స్త్రీరత్నము హయరత్నము వారణరత్నంబుదొట్టి వరవస్తువు లె
వ్వారివి కనఁబడఁగూడదు, వారక విడిపించుకొందు వడిఁ గనఁబడినన్".

వ॥ అని యిట్లు వక్కాణించిన వేలుపులకుంబోలె మహాసేనునకును వక్త్రద్వారం
బులనుండి విశేషించి క్రోధంబు వెలువడుడు నుభయక్రోధమేళనంబున సర్వలక్షణ
సంపన్నయు దివ్యతేజోన్వితయు నగు నొక్కకన్నియ యుద్భవించి కాత్యాయనీనామం
బున విరాజిల్లె, నంత నాయమకు వాసవుండు వజ్రంబును షడాననుండు శక్తిని జనార్ద
నుండు చాపంబును మహాదేవుండు త్రిశూలంబును వరుణుండు పాశంబును సూర్యుండు

బాణంబులను జంద్రుండు తూణీరంబును నిర్బృతి కత్తిని హుతాశనుం డుల్కాకంబును వాయువు ఛురికయుఁ గుబేరుండు పరిఘయు యముండు దండంబును మహిషసంహారార్థ మర్పించుటయుఁ ద్వాదశాయుధంబులను విలోకించి ద్వాదశభుజసమేతయై వానిధరియించి పులకాంకితదేహయగుచు నాదేవి దేవతలంగూర్చి

కం॥ "ఎందులకై సృజియించితి రందఱు గుమిగూడి చెప్పుఁడమరవరేణ్యుల్ !
సందేహింపకఁ చని మున్ముందుగ నది నిర్వహించి ముదమొనరింతున్" ౧౩౩

వ॥ అనియడిగిన దేవతలిట్లనిరి, ౧౩౪

మ॥ "మహిషుండం చిపు డొక్కరక్కసుఁ డసామాన్యుండు ప్రొట్టైన్ భయా
వహుఁ, డాతం డొక స్త్రీకిఁదప్ప నెపుడున్ వధ్యుండు గాఁ డొల్ల, క
య్యహితుం గూల్పనె నిన్ సృజించితిమి మే, మట్లౌట వింధ్యాద్రికిన్
రహినైనేగి తపంబొనర్పుము మహాప్రావీణ్యతా నంతకున్, ౧౩౫

శా॥ తేజస్సంయుత వౌటెఱింగి నిను మా దివ్యత్పురోభాగమం
దోజం జేరిచి తన్నిశాచరునితో యుద్ధంబుగావించి దు
ర్బీజుం ద్వచ్ఛరవహ్ని వ్రేలిచి మహాప్రీతాత్మతం బోయి మా
భ్రాజత్స్వర్గసుఖంబులం గుడుతు మోభద్రాణి! యత్యంతమున్, ౧౩౬

వ॥ అని యిట్లువాకుచ్చి యిచ్చిన నప్పరమేశ్వరి వాహనంబుగోరుకొనుటయుఁ బార్వతి వికృతాననంబగుసింహంబునొసంగె, నాయమ తదారూఢయై వింధ్యనగంబున కరిగి శోభ్రద్రుమాన్వితంబును ఫలపుష్పసమాకీర్ణంబును లతామండపమండితంబును నగు నొకశిఖరంబునఁ బ్రవేశించి తీవ్రవ్రతపరాయణత్వంబున నిందిరియంబుల నిరోధించి మహేశ్వరుంగూర్చి తపంబొనరించుటయు నెట్లెట్లు లాతపంబు వృద్ధిఁజెందె నట్టట్టు రూపంబును గాంతియు నాయమశరీరంబున వృద్ధిఁజెందె, నింతలోన దైత్యేశకింకరులం దరుదెంచి వ్రీతోపేతయు నత్యద్భుతవపుర్ధరయు నగు నాదేవిం బొడగాంచి స్వనాథుండగు మహిషునికడ కేగి

తే॥ "ఎన్నడుం గూడఁజూడని కన్నెయొకతె గానవచ్చెను వింధ్యాద్రిపైన మాకుఁ
బదియురెండుభుజంబు లాభామ, కవియు దివ్యశస్త్రసమేతముల్ దేవ! వింటె,

త్వరపడుడు ! త్వరపడుడు !!

కొలదిప్రతులుమాత్రమే కలవు.

పరమపవిత్రమగు నాటకము.

కరుణారసము వెల్లివిరియుచున్నది.



బ్ర॥ శ్రీ॥ బలిజేపల్లి లక్ష్మీకాంత
కవిగారు రచియించిన

# ఉత్తరరాఘవము

(కుశ-లవ నాటకము.)

మృదుమధురములగు పద్యములు చూడుడు.

మ॥ అనుగుంబ్రేయసిచేత నేర్చి, యలవాలై నాదుకొల్వెగా
కను దూరంబునఁగాంచి చేటికసి, "అక్కా! రాముఁడే తెంచె న"
మ్మని ముద్దారఁగ జానకింబిలుచు నొయ్యారంపుగాచిల్క మం
తన మింతింతగ నంపమై తువియకుండన్ గోయు హృన్మర్మముల్॥

చ॥ "బ్రతికినయంతకాల మపవాదములన్ భరియించి, భార్యయున్
బతియును ముద్దుముచ్చటల భాగ్యము లేమియు లేక, మొండిమై
బ్రతుకుటమాను నానొసట వ్రాసెను తీరిచి మూఁడుబంతులన్
మతకరి బ్రహ్మ, సిరిపుత్రుకు మూర్తువె నా తలవ్రాఁత లక్ష్మణా"॥

వెల రు. 1–4–0. పోస్టేజి ప్రత్యేకము.

6 ప్రతులకుతక్కువ కాకుండా కొనువారికి కమీషను యివ్వబడును.

గ్రంథాలయములకు సగము వెలకు ఇవ్వబడును.

☛ పుస్తకములు గోరువారు :—

బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు, గుంటూరు

అను వ్రాయవలయును.

# అభినవసరస్వతి

పత్రికాధిపతి:— జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములను వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 2—0—0

## ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ఆళ్ళయాచార్యవిజయము | ... | 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి [పూరి వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి [సింహాద్రి వెంకటాచార్యులు] | | 0 | 4 | 0 |
| 6 | విశాఖపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతులు [సుమతిశతకమునకు సంస్కృతము] | ... | 0 | 2 | 0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 9 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 10 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము [పత్రికాధిపతి] | ... | 0 | 4 | 0 |
| 11 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 12 | గురిగింజ | ... | 0 | 1 | 0 |
| 13 | పుళిందావివాహము [పత్రికాధిపతి] | ... | 0 | 4 | 0 |
| 14 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 15 | శివానందలహరి [తంగెడ రామకృష్ణకవి] | ... | 0 | 4 | 0 |
| 16 | లక్ష్మీవిలాసము [రాయసము వెంకటపతి] | ... | 0 | 4 | 0 |
| 17 | నర్సారావుపేట శతావధానము [తిరుపతివెంకటీయము] | | 0 | 3 | 0 |
| 18 | పశ్యాంపుశ్యాం | ... | 0 | 2 | 0 |
| 19 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 20 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 21 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 22 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 23 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 24 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 25 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 26 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 27 | స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము | ... | 1 | 0 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము,
జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరుజిల్లా.